# గిత్తల బేరం

(నాటికలు)

రచన:

సుంకర సత్యనారాయణ

విశాలాంధ్ర ప్రచురణాలయం,
బకింగ్‌హాంపేట విజయవాడ.

·

# 'గిత్తలబేరం'

1955 నవంబరులో మద్రాసులో జరిగిన ఆంధ్రవిద్యార్థి విజ్ఞాన వారోత్సవాల్లో విద్యార్థులు దాదాపు పది నాటికల దాకా ఆడారు. అందులో ఈ "గిత్తలబేరం" నాటిక మదరాసు న్యాయకళాశాల విద్యార్థులచే ప్రదర్శింపబడి ప్రథమ బహుమతి పొందినది.

| పాత్రలు : | వయసు : | నటవర్గం : |
|---|---|---|
| కేశవయ్య | 42 | కె. బి. శంకరరావు, బి.ఎ., |
| వీరయ్య | 45 | కొసరాజు భానుప్రసాద్, ఎం.ఏ., |
| జగన్నాథం | 25 | జి. వి. సంజీవి, బి.ఏ., |
| మాధవరావు | 20 | రాజ్. ఎం. వి. సాగర్, బి.యస్‌సి., |
| (భద్రయ్య) | 45 | ఎ. విశ్వేశ్వరరావు, బి.ఏ., |
| (దళారి దానయ్య) | 35 | ఎ. హెచ్.వి. సుబ్బారావు, బి.ఏ., |

దర్శకత్వం : { శ్రీ వేదాంతం చిదానందం,
,, ఎస్. ఎల్. పెరుమాళ్ళు.

[ ఆవూరు చాల పెద్దది. చిన్న బస్తీలా వుంటుంది. ఊరి మధ్యభాగంలో కిల్లీకొట్టు ఒకటి వుంది. కొట్టుముందు పొడుగాటి యెత్తయిన బల్ల. దానిమీద రంగులు కలిపిన నీళ్ళతో నింపినసీసాలు వరుసగా పెట్టివున్నాయి. ప్రక్కగా చిన్ననీళ్ళ తొట్లో సోడా సీసాలు. ఎదురుగా తమలపాకుల పళ్ళెం. పళ్ళెంచుట్టూ సుగంధ ద్రవ్యాల చిన్న చిన్న సీసాలూ, భరిణలూనూ. అరటి గెలా, వక్క పొట్లాల దండలూ వ్రేలాడు తున్నాయి. కొట్టుదగ్గరకు వచ్చినవాళ్ళు కూర్చోడానికి రెండు కుర్చీలూ, ఒక బెంచీకూడా వుంది. తెర లేచింది.

(మాధవరావు కొట్లోకూర్చొని ఏదో పుస్తకం తిరగ వేస్తూ కూనిరాగాలు తీస్తున్నాడు. వయసు యిరవై. నూనూగు మీసాలు. చిన్నక్రాపు. ఫుల్ షర్టు. పైజామా.)

ఇంతలో మాధవరావు తండ్రి కేశవయ్య వచ్చాడు. వయసు 42. ధోవతి, బనియను, భుజాన తుండు. సంస్కారం లేని క్రాపు. బొద్దుగా వున్నాడు.]

కేశవయ్య : అరే, మాధవా !

మాధవరావు: ఆఁ, (పుస్తకం మూస్తూ, తండ్రివైపు చూస్తాడు.)

కేశ : ఎవరో యిద్దరు భోజనానికి వస్తారని చెప్పావటగా, మీ అమ్మతో. ఎవర్రా వాళ్ళు ?

మాధ : ఆఁ, ఎవరో బాటసార్లు.

కేశ : బాటసార్లా !

మాధ : అవును నాన్నా ! దాదాపు ఒంటిగంట కావచ్చింది అందులో వేసవికాలం. మన వూళ్ళో చూద్దామన్నా హోటల్ లేదు. పాపం వాళ్ళగతి ఏంకావాలి. అందుకని..

కేశ : అందుకని నీ యింటికి భోజనానికి పిలిచావ్! తను దూర కంతలేదు మెడ కొక డోలట.

మాధ : అది కాదు నాన్నా!

కేశ : ఏది కాదు. అసలు నీకేమన్నా మెదడుందా? ఎక్కడ తెచ్చిపెడతావురా, భోజనాలు. దారే పోయేవాళ్ళందర్నీ పిలిచి ?

మాధ : అందర్నీ యెందుకు పిలుస్తాను.

కేశ : కాకపోతే యేమిటిదంతా. ఇంకా నే నసలు చుట్టా లనుకున్నా.

మాధ : చుట్టాల్ని ఒకరు పిలవడం యెందుకు ? వాళ్ళే వస్తారు, ఇంట్లో తిని యింటివాసాలు లెక్కపెట్టడానికి.

కేశ : ఊఁ, వీళ్ళు మెచ్చి మేకతోలు కప్పుతారు.

మాధ : అదేమోకాని, వంకలు పెట్టకు. మర్యాద తక్కువైనం దని గొణగరు. ఊరూరా చాటరు. ఉన్న దేదో వేళకు పెట్టినందుకు కనీసం సంతోషిస్తారు.

కేశ : చాలు. అంతట ఆపు నీ వుపన్యాసం. వింటే ఎవరైనా నవ్వుతారు.

మాధ : సరే, మీకు అంత కష్టంగావుంటే వాళ్ళను వెళ్ళి పొమ్మంటాను. (బయటికి బయలుదేరాడు.)

కేశ : ఒరేయ్, మాధవరావు (ఆగుతాడు) ఆ తెలివి మొదటే వుండాలి. ముందు ఆశపెట్టి, తర్వాత లేదనడమా! ఇల్లాంటి తెలివితక్కువ పనులెన్నడూ చెయ్యకు. ఇంతకీ వాళ్లెక్కడ?

మాధ : చెరువులో స్నానం చేస్తున్నారు.

కేశ : అటునుంచి అటే మన యింటికి పోరుగదా !

మాధ : లేదు. ఇక్కడికే రమ్మన్నాను.—(విండులోకి చూస్తూ) అరుగో, వస్తున్నారు. (వారిని ఆహ్వానించుతూ) రండి, దయచేయండి. (తండ్రిని చూపుతూ) వీరు మానాన్నగారు.

[వీరయ్యా, జగన్నాథం లోనికి ప్రవేశించారు. వీరయ్య వయస్సు 45, చామనచాయ. గడ్డం మాసింది. బుర్రమీసాలు. నెరసీ నెరయని తల. ధోవతి, ఆఫారం, ఉత్తరీయం. చేతిలో కర్ర. కాళ్ళకు చెప్పులు. చంకలో బొక్కాశా.

జగన్నాథం వయస్సు 25. క్రాపు. చిన్న మీసం. ధోవతి ధరించాడు. సాఫ్‌షర్టు. భుజాన టవల్. కాళ్ళకు చెప్పులు.]

జగన్నాథం :<br>వీరయ్య : } నమస్కారమండి.

కేశ : నమస్కారం. నమస్కారం.

వీర : తమ నామధేయం.

కేశ : కేశవయ్య అంటారు లెండి. (కుమారునితో) ఒరే, అబ్బాయ్! (బెంచీ చూపుతూ) బల్ల తుడవరా, కూర్చుంటారు.

జగ : ఫర్వాలేదు లెండి.

[మాధవరావు గోనెపట్టాగో బుస్తుతుడవగా నాను కూర్చుంటాను. వీరయ్య బొక్కిశా బల్లమీద పెట్టాను.]

కేశ : అబ్బాయ్ మాధవా! నువ్వింటికెళ్ళి...

మాధ : సరె నాన్నా! అదంతా నేను చూస్తానుగా. (బయలుదేరాడు)

వీర : (యువకుడు వెళుతున్నవైపు చూస్తూ) నాయనా! (మాధవరావు ఆగి వీరయ్యవైపు చూస్తాడు) ప్రత్యేకంగా మమ్మల్ని గురించి నువ్వు...

కేశ : దానిదేంటిలెండి. (మాధవరావు నవ్వుతూ వెళ్తాడు)

వీర : తమకు పిల్లలెంతమందండి, కేశవయ్యగారూ ?

కేశ : వీ డొక్కడేనండి.

వీర: పనికిరాని చెత్త నూరుమంది వుండెందుకు? ఇట్లాంటి పుత్రరత్నం ఒక్కడున్నా చాలు. ఎంత నిదానం. ఎంత వినయం. ఎంత విధేయత. ఎంత భూతదయ ! (జగన్నాధం వైపుతిరిగి) ఏంరా జగన్నాధం.

జగ: చెప్పాలా ? ఎంత జాలిహృదయం కానిది, దారేపొయ్యే వాళ్ళను భోజనానికి పిలుస్తాడూ !

కేశ: అది మొదటినుంచి మా కొంపలో ప్రతివాడికి ఉన్న అలవాటేలెండి.

వీర: తెలుస్తానే వుందిగా. చెట్టునుబట్టే కాయ. ఏమంటారు ?

కేశ: (నవ్వుతూ) ఏదోలెండి. ఆఁ ... ఇంతకూ తమ పేరేమిటో శెలవిచ్చారుగారు.

జగ: వీరి పేరు వీరయ్యగారు, నా పేరు జగన్నాధం.

వీర: ఆఁ, మరచాను, తమ యింటిపేరు ?

కేశ: వియ్యాలవారు.

వీర: (నవ్వి) అట్లాగా, అయితే మీకు మాకు బావా బావమరదులవరస. మా యింటిపేరు కయ్యాలవారులెండి.

కేశ: ఏమిటీ ! చెప్పారుగాదు. కయ్యాల కనకయ్యగారు స్వయంగా మా మేనమామ. ఆయనగారి కుమార్తెను మా యింట్లోనే యిచ్చింది.

వీర: ఏమి సేమిటి ! (జగన్నాథంవైపు తిరిగి అతనితో) ఓహోహోహోహో, కనకయ్యగారిని నువ్వెరగవుగాని జగన్నాథం, నాపైన నా చెయ్యెత్తు మనిషి. ఆయన పేరు చెప్తితే, యీ చుట్టుపట్ల పదీ పన్నెండూళ్ళలో పసిపిల్ల పాలుతాగేదికాదు, ఆయన మీసం ఏం మీసం ! నిమ్మకాయ నిలిపితే అట్లా నిలబడాలిసిందే. ఇట్లా వంగేదా !

జగ: (ఆశ్చర్యంగా) అమ్మబాబోయ్ !

వీర: అంతేకాదు. ఆయనుండగా, పొరుగూరివాడు ఆ వూరి నడిబజార్ని చెప్పులు తొడుక్కుని, గొడుగు వేసుకుని నడవటానికి వీలుండేదా ? వచ్చినట్లు వూరి యివతల గొడుగు దంకలో పెట్టి, చెప్పులు చేతపుచ్చుకుని మళ్ళీ వూరిఅవతల తొడుక్కోవలసిందే.

జగ: ఆఁ !

వీర: ఆఁ ఏమిట్రా ఆఁ. కలెక్టరంతటివాడు వూరిబయట గుర్రాన్ని దిగి వూళ్ళో అడుగుపెట్టేవాడు.

కేశ: ఏమైతే ఏం లాభంలెండీ. ఆయనతోనే అదంతా పోయింది. ఆయన్ని అట్లా తీసుకెళ్ళారు. ఇట్లా అప్పులవా

గోళ్ళొచ్చి వున్నదంతా కట్టుకుపోయాను. ఆయనసలే కాదు. మా ఆస్తి పోయిందికూడా అప్పుడే.

జగ : అదేవిఁటి ! మీ రెందుకు పోవాలి ?

కేశ : వేరే ఏంలేదు. మా నాయన కనకయ్యగారిమాట కాదనలేక అడ్డంవుండి అప్పు యిప్పించాడు...

వీర : సరి సరి అర్థమైందిలెండి. చెప్పనక్కర్లా. అయినా వెధవ ఆస్తి దానిదేవిఁటి. ఇవ్వాళ పోతే రేపు వస్తుంది. నిజంగా కనకయ్యగారికుమార్తె మీకు భార్యాకానడం...

కేశ : అబ్బెబ్బే. నాకు కాదండి ఆమె నిచ్చింది. మా పెదతండ్రి కొడుక్కి.

వీర : మీ క్కాదూ ?

జగ : ఎవరికైతేనే, వారి కుటుంబంలో నేగా యిచ్చింది.

వీర : అంతే మరి.

కేశ : అదేదో అయిపోయింది. దానికేంగాని యింతకీ తమరు వచ్చిన పని ?

జగ : ఆఁ మరేంలేదు. గిత్తబేరానికిలెండి.

వీర : మావాడిదగ్గిర భేషైన గిత్త ఒకటుంది. దాని జతకి యింకొకటి కావాలిసి.

జగ : నాకే కాదు; మా బావకీ కావాలి ఒక గిత్త.

వీర : (మందలింపుగా) జగన్నాథం — కేశవయ్యగారూ ! మన వూళ్లో మంచి కుర్రవాళ్ళు—అంటే ఈ సంవత్సరం పెళ్ళి కావలసినవాళ్ళు—వున్నారా ?

కేశ : కుర్రవాళ్ళకేం, కావలసినంతమంది.

జగ: ఉండు బావా! నీ బేరం ఇప్పుడు తెగేదా, వచ్చేదా. నీ కూతురుకు మగడు యీ యేడు కాకపోతే ముందుకు దొరుకుతాడు. ఇబ్బంది లేదు. నాకు నాలుగు రోజుల్లో గిత్త దొరక్కపోయిందంటే యింకేమైనా వుందా! వ్యవసాయం నాశనమైపోదూ! (దళారితో) ఇదుగో యియ్యా! ఖచ్చితంగా మూడు మూళ్ళుండాలి గిత్త.

[ మాధవరావు వచ్చాడు ]

దళా: అయితే వుంది లే ఒకటిక్కడ.

జగ: ఎత్తువుండగానే సరికాదు. గిత్తపుటక ?

దళా: పుటకా! చేపెన నంది. చూచినా అట్టా వుండాలి.

జగ: అయితే పద. (వీరయ్యతో) రా బావా!

వీర: నీవు పోయి చూచి రారా. నచ్చితే తరువాత మాట్లాడదాం.

జగ: ఒంటరిగా పోనా. మాధవరావును తీసుకెళతా.

కేశ: ఏడా! గిత్తలబేరానికి! ఊడతీసుకున్న దూడను కట్టి వెయ్యడం చేతగాదుగాని.

జగ: ఏదో జతగా పోయి వస్తాం. రావోయ్ మాధవరావ్.

కేశ: సరె, పోరా. (మాధవరావు రెండడుగులు వేస్తాడు.) అబ్బాయ్ దూరంగావుండి చూడు, గిత్త కాలికందకు వెళ్ళకు, తన్నేను.

జగ: (నవ్వుతూ) గుడ్డిదైతే బెదరి తన్నుతుందిగాని, మంచి గిత్తలు తన్నవులెండి.

దళా: గుడ్డిదీ కాదు సడ్డిదీ కాదు. నడవండయ్యా!

(జగన్నాథం, మాధవరావు నవ్వుతూ బయలుదేరి దళారిని అనుసరించారు)

కేశ : ఇదుగో, వీరయ్యగారు! మావాళ్ళ కుర్రవాడొకడున్నాడు చూస్తారా? ఎఫ్. ఏ. చదువుకున్నాడు.

వీర : కట్నం ఎంతలో వుంది?

కేశ : ఇరవై వేలకు పైమాట. అంతకు తక్కువైతే ఆ గడప తొక్కనక్కర్లా.

వీర : అంతదూరం మనం తూగలేంలెండి. పదివేలు. తప్పితే పన్నెండు, ఆపైన లాభంలేదు.

కేశ : పది పన్నెండుకులోనా. (ఆలోచించి) ఆఁ. ఉన్నాడొకడు. మంచిదే సంబంధం. కుదిరితే.

వీర : ఆస్తి ఏమైనా...

కేశ : ఆఁ, సుక్షేత్రంలాంటి యెకరం న్నర మాగాణి వుంది. ఈ సంవత్సరం ఆంధ్రా మెట్రిక్‌కు కూచ్చున్నాడు. పాసయ్యాడో లేదో మరి. అవుతాడులెండి.

వీర : కుర్రవాడెట్లా వుంటాడు? మన అమ్మాయి వుంది చూశారూ, (లేచి నిలబడి) నన్ను చూస్తున్నారుగా. ఒడ్డూ పొడుగూ కాస్త కూస్తకేమొచ్చె, నాఅంత జమానూ అనుకోండి.

కేశ : (చప్పరించి) అయితే వాడు లాభంలేదులెండి.

కేశ : అది సరేగాని, మీ అమ్మాయికి ఒక్కశుద్ధి యేమైనా వుందా?

వీర : అదేవిటండోయ్, యస్.యస్.యల్.సి. చదువుతూ పరీక్షకు మూడు నెలలు ముందు రజస్వలైందీ...

కేశ : అయితే చదువు మాన్పించారా, కొంపతీసి !

వీర : ఏం చేస్తాం చెప్పండి. మన కొంపల్లో ఏ పన్నేళ్ళు నాక ఆడపిల్లను బడికి పంపడమంటే, ఊరూరికి నిప్పంటుకోదూ!

కేశ : అరరెరె ఆ మూడుమాసాలు కూడా అది బరక్కుండా వున్నట్లయితే . . .

వీర : ఫస్టున పాసయ్యేదనుకోండి.

కేశ: అట్లాంటప్పుడు మీరు ధైర్యంచేసి చదివించినాపోయేది.

వీర : చదివించేవాణ్ణే, లాభం ? ఎంతచదివించినా యిచ్చే కట్నం యివ్వక తప్పదు. పైన బాగా చదువుకున్న పిల్లకి మొగుడు దొరకడం మరీ కష్టంగా వుంది. ఏమంటారు ?

కేశ : అది నిజమేననుకోండి కాని. . . .

వీర : ఈ వూళ్ళో యిక లాభం లేదంటారా ?

కేశ : మీరు చెప్పిన లెఖ్ఖప్రకారం, యేటవతల తోటాకుల పాలెంలో ఒక మంచి సంబంధం వుందండి.

వీర : (ఆలోచించి) ఏది, సుబ్బయ్యగారి కొడుకు సంగతా ?

కేశ : ఆఁ ఆఁ, కుర్రవాడు దిట్టంగా వుంటాడే గిత్తలాగా.

వీర : వున్నాడు ఉండటానికి, ముక్కూ మొఖం లేకుండా. మా అమ్మాయి యెంత ఎరుపో వాడంత నలుపు. మాల కాకి వన్నె.

కేశ : అట్టే చూస్తే ఈ చుట్టుపట్ల వూళ్ళన్నీ తిరగేసినట్లుంది.

వీర : అవాఁ. వెనక ఆడపిల్లకి మొగుడు దొరికేసరికి యేడు చెప్పుల జోళ్ళు తెగేవట. ఇప్పటికి నాకు యేడు వందలు ఖర్చయినై. ఇంకా యెన్ని వందలు కానాలో మరి.

కేశ : ఆ కాలమే మారిపోయింది లెండి.

వీర : కాలం కాదు మారింది, బుద్ధులు. మొన్న మల్లారం వెళ్ళితే అక్కడా ఒక సంబంధం తగిలింది.

కేశ : ఆఁ, ఆఁ.

వీర : వాళ్ళ 'కోవ' అంత మంచిది కాదు లెండి. దరిద్రపు కోవ. ఆడవాళ్ళు పొలం వెళ్తారు.

కేశ : ఆఁ! ఇక మీరు గుణాలన్నీ పెట్టుకుంటే అమ్మాయి పెళ్ళిచేసినట్లే. వాళ్ళపని వాళ్ళు చేసుకున్నా తప్పేనా? మన పిల్లలు వెళ్తుంటారా నాటకాలకీ, సినిమాలకీ, బజారుకీ, బట్టల కొట్లకీ.

వీర : చివరికి తెలవంచి దానికీ లోబడ్డా. కాని, వాళ్ళూ యిరవై వేలు అడిగారు.

కేశ : ఈ రోజుల్లో ఒక మనిషి హోదాను నిర్ణయించేది డబ్బుగాని కోవగాదు. అవునా?

వీర : కాదనడానికి ఎవడితరం!

కేశ : అందువల్ల మీ గొంతెమ్మ కోరికలన్నీ తీరాలంటే కష్టం బావగారూ! అయినా మా ఊళ్ళో యింకో బేరం వుంది. కుదిరితే అది కుదరాలి మీకు.

వీర : అది యెట్లాంటిది?

కేశ : కుర్రవాడి తండ్రి చాలా పలుకుబడిగల మనిషి. మా వూరి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు. ఆయన బల్లయెక్కి ఉపన్యాసం మొదలుపెట్టాడంటే బల్ల పగిలిపోవలసిందే. అట్లాంటి మనిషి; ఆ స్థితిగతి వేరే చెప్పనక్కర్లేదుగా.

వీర : మరీ, అంత గొప్పవాళ్ళయితే మనకు అందుతారా అబ్బా.

కేశ : నిజానికి అంతేగాని ఒక్క విషయం వుంది. ఆయన కట్నాలు తీసుకోవటం తప్పని వాదిస్తావుంటాడు మరి.

వీర : (ప్రాణం లేచివచ్చి) అయితే కేశవయ్యగారు! తప్పకుండా యీ సంబంధం ఆలోచించండి. మీ మేలు మరచిపోను.

[జగన్నాధం వచ్చాడు]

కేశ : కనుక్కుందాం.

జగ : ఏవిఁటండోయ్, కనుక్కునేది ?

వీర : ఇక్కడో్క మంచి సంబంధం వుందిరా. మన హోదాకు తగింది.

జగ : హోదాల సంగతి తరవాత. అసలు పిల్లవాడెల్లాంటి వాడో.

కేశ : కుర్రవాడికేం. ఉంటాడ్కుగాని సుమారుగా, ఒక కన్ను కొద్దిగా మెల్ల.

జగ : అయ్యిందీ! విన్నావా బావా ?

వీర : దానిదేవిఁటిలే. తతిమ్మా విషయాలన్నీ చాల బాగు న్నై. మీ కెందుకు మీరు కనుక్కోండి కేశవయ్యగారూ!

జగ : (వ్యంగ్యంగా) సరె, కనుక్కోండి.

కేశ : ఇంతకీ, నీ గిత్త బేరం యేమైంది ?

జగ : కుదిరింది.

వీర : ధరెంత ?

జగ : ధగ పది అలాగే యిటొ; నా గిత్త జతకి సరిగ్గా సరిపో తుందనుకున్నా. కొన్నాను. రెండూ అన్నదమ్ముల్లా వుంటాయి.

వీర : అంత మంచి గిత్త యింత తొందర్లో యెట్లా దొరి కిందిరా ?

జగ : పశువుగదూ ! ఉన్నవాడి దొడ్లో పుట్టినా, లేనివాడి దొడ్లో పుట్టినా దానికి ఒకటే విలువ.

కేశ : అంటే ?

జగ : అంటే – రెండు కాళ్ళ జంతువు బేరం వేరుగా. అది పుట్టిన దొడ్డిని పట్టి దాని విలువ వుంటుంది.

వీర : (కోపంగా) నోటికి వచ్చినట్లు మాట్లాడకు. దానికీ దీనికీ సంబంధం యేవిటంట.

జగ : అప్పన్లే దానికి నాలుగు కాళ్ళుంటాయి. దీనికి రెండే. దాన్ని బేరం చేసేటప్పుడు అసలు వస్తువు మంచిదో కాదో చూచుకుంటాం. కాని దీని సంగతి వేరు. వస్తువు మంచిది కానీ కాకపోనీ, మనకు పనికిరానీ రాకపోనీ, దాని వెనుక వున్న హంగామానుబట్టి బేరంచెయ్యాలి. రైటే బావా !

వీర : (విసుగ్గా) వింటున్నారుగా కేశవయ్యగారూ, మావాడి మాటలు !

కేశ : ఏదో కుర్రతనం.

జగ : అంతేలెండి, బలేపదం.

వీర : కాకపోతే నీకేం తెలుసురా, సంసారం అన్నాక వుండే కష్టసుఖాలు. నిన్నగాక మొన్న కళ్లు తెరచావ్. కేశవయ్య గారూ మీరు మాట్లాడండి.

కేశ: తొందర పడకండి.

[భద్రయ్య ప్రవేశించాడు. నున్నగా దువ్విన తల. చిన్న బొజ్జ. ఖద్దరు పంచ. లాల్చీ. బిళ్ళమడత విప్పని వుత్తరీయం. చేతిలో పొన్నుకర్ర. కాళ్ళకు కాన్పూరు చెప్పులు]

భద్ర: (వస్తూనే) కేశవయ్యా.

కేశ: (అటుచూసి) ఒహో భద్రయ్యగారా దయ చెయ్యండి, దయచేయండి. (కుర్చీ సర్దుతూ) మీకునిండా నూరేళ్లాయుష్షు. మీ మాటే అనుకుంటున్నాం.

భద్ర: (కూర్చుంటూ) అట్లాగా ఏమిటని?

కేశ: వీరిది...(జగన్నాథంవంక చూస్తాడు)

జగ: శనివారప్పేట.

కేశ: మీతో సంబంధం అందుకోవాలని వచ్చారు.

భద్ర: అలాగా! అయితే వీర్ని మన యింటికి తీసుకరాక యిక్కడ వుంచావెందుకు? (వీరయ్యతో) వెళదాం పదండి.

వీర: చిత్తం చిత్తం. వెళ్లొచ్చులెండి.

భద్ర: అదేం మాట, లేవండీ ముందు. కేశవయ్యా ఒక అరకట్ట ఆకులు ఇలాతే. వక్కలుకూడా.

కేశ: అట్లాగే. (ఆకులూ, వక్కలూ కడుతూ వుంటాడు)

భద్ర: కేశవయ్య మా విషయమంతా తమతో చెప్పే వుంటాడు.

జగ: తమర్ని గురించి చెప్పాలటలెండి! (క్రిందకీ పైకీ చూసి) కనపడటంలా!

కేశ : తొందర పడకండి ... కేశవయ్యకు తెలుసుగా.
కేశ : ... అమ్మాయి సంగతా. ఇప్పుడుగాదు, ఇంకా పది యేళ్ల తరవాత చూచినా, ఆ పిల్ల అట్లాగే వుంటుంది.

భద్ర : (నవ్వుతూ వీరయ్యతో) సరె, ఇదంతా యెందుకు, మీరే చూస్తారుగా. పదండి వెళదాం ఇంటికి.

కేశ : అబ్బే, భద్రయ్యగారూ! వీరికి కావలసింది అమ్మాయి కాదు. వీరి అమ్మాయిని తమ అబ్బాయికి ఇవ్వటానికి వచ్చారు.

వీర : (గుటకలు మింగుతూ) అవునండి.

భద్ర : (తెల్లపోయి) అబ్బాయి విషయం అయితే కొంచెం ఆలోచించాలి లెండి.

వీర : తమరు వరకట్నం పుచ్చుకోక పోయినా, మేము యివ్వ తలచుకున్న దేదో అమ్మాయికి యిచ్చుకుంటాం. మరో విధంగా అనుకోకండి.

కేశ : బాగానే వుంది. మీరు యెట్లాగూ పదివేలు వరకట్నం యివ్వదలచారు. అదే యిప్పుడు అమ్మాయికి పసుపూ కుంకుమ కింద యిస్తారు. తప్పేముంది.

భద్ర : అదికాదయ్యా!...

జగ : (వ్యంగ్య ధోరణిలో) పబ్లికులో అల్లుడికి కట్నం చదివించకుండా ఆ మొత్తం తమ చేతిలోపొయ్యమన్నా అభ్యంతరంలేదు. (వీరయ్యవైపు తిరిగి) ఏం, బావా!

వీర : వారి చిత్తం యెలావుంటే అలా.

భద్ర : ఈ భద్రయ్య అలాంటి దొంగకూళ్లు కుడిచే బాపతు కాదంటోయ్.

మాధ: ఆ నవ్వుకు ఏదో అర్థముంది.
జగ: పెద్దవాళ్ళు అర్థం లేకుండా నవ్వుతారామరి! ఒకవేళ వాళ్ళ అమ్మాయిని నీకు యివ్వదలచి నవ్వాడేమో.
కేశ: ఆయన కూతుర్ని మాబోటివాళ్ళ కిస్తాడా?
మాధ: ఇస్తే చేసుకునే దెవడు. నాకన్నా సంవత్సరం పెద్దది.
వీర: (ఆశ్చర్యంగా) నీకంటేనా! ఇంతకీ నీ వయస్సెంత?
మాధ: ఇరవై.
జగ: మరి వాళ్ళ అమ్మాయికి పదిహేడేళ్ళనటగా.
మాధ: అది వాళ్ళ అబ్బాయి వయస్సు. మీకు తెలిసి తెలిసి చెప్పివుంటాడు.
వీర: ఏమండీ కేశవయ్యగారూ! మీరైనా చెప్పలేదేం?
కేశ: మీ రా అమ్మాయిని చేసుకునేవాళ్ళా పాడా. ఏదో ఆయన ఇష్టంవచ్చినట్లు చెప్తున్నాడు. పోనిద్దురూ.
జగ: ఇరవైయేళ్ళు వచ్చినా, పద్ధానుగేళ్ళ పిల్లలా వుంటుం దట. అంత అందమైనపిల్లా ఏమిటి?.
కేశ: ఏదో వుంటుంది.
మాధ: ఆఁ. వుంటుంది. భూమికి బెత్తెడు ఎత్తున. పొట్టి తింగణా.
కేశ: ఆ పిల్ల యెట్లావుంటే నీ కెందుకురా.
జగ: అవును. ఎదటివాళ్ళ గొడవ ఎందుకు, మనది మనం సరిగ్గా చూచుకుంటే చాలు.
వీర: నాయనా! మాధవరావ్! నీవు ఏం చదువుకున్నావ్?
మాధ: బి. ఏ.
కేశ: ఫస్టున పాసయ్యాడు.

వీర : మరి ఈ సంవత్సరం పెళ్లి చెయ్యరు ?

జగ : సారకాలిగా. చదువుకున్న వాడికి చదువుకున్న పెళ్లాం కావాలని వుంటుంది. లేనివాళ్లు తమ మగపిల్లలకే చదువు చెప్పించలేకుండా వున్నారు. ఇక ఆడపిల్లల కేం చెప్పిస్తారు. ఉన్నవాళ్లు, పిల్లల్ని ఇట్లాంటివాళ్ల కివ్వరు.

వీర : బంగారంలాంటి పిల్లవాడు. ఇతనికి పిల్ల నివ్వడానికేం. ఎవరూ ఆడితే నాదే యిస్తాను.

జగ : ఆఁ. ఇస్తారు. అందాకా యెందుకు నీ విస్తావా ?

కేశ : వాడికి యెవ్వరూ యివ్వనక్కర లేదు. మేనమామ కూతురే వుంది.

జగ : చదువుకుందా ?

కేశ : ఏదో అడపాదడపా చదువుకుంది. ఈ చైత్రమాసంలో లగ్గం పెట్టుకోవా లనుకుంటున్నాం.

మాధ : నాన్నా ! పెద్దమనుషుల దగ్గర ఇలాంటి మాటలు చెప్పడం మంచిదిగాదు. నీకు అనేకసార్లు చెప్పాను నే నా పిల్లను చేసుకోనని.

కేశ : చెప్తావురా నీకేం. చెప్తావు. చేసుకోనంటే తప్పుతుందా ? మేనమామ కూతురుగా, ఇదివరకే మాట యిచ్చాను.

మాధ : నన్నడిగి మాట యిచ్చారా? ఆ తప్పు మీది.

కేశ : ఏమిటోయ్ నిన్నడిగేది ?

మాధ : నన్ను అడగకుండా ఇంకెవ్వరికైనా యిచ్చుకుంటే నా అభ్యంతరమేమీ లేదు.

కేశ : కట్టిపెట్టరా నీ వదాన్యత్వం సరాటాలు. ఇదిగో వీరయ్యగారూ! మీరు చెప్పండి న్యాయం. వీడు పుట్టి టప్పటికే ఆస్తిపోయింది. నా రెక్కల బలం సగం సగం పెట్టి ఎట్లాగో బతుకుతూ, ఒక్కణ్ణీ అడగకుండా, యాచించ కుండా వీణ్ణి చదివించాను. మొన్న బి. ఎ. చదవటానికి డబ్బు లేకపోతే, వీడి మామ రెండువేలిచ్చాడు. ఎందు కిచ్చాడంటారూ?

వీర : ఆయన కూతుర్ని చేసుకుంటాడనే ఇచ్చివుంటాడు లెండి.

కేశ : అవునుగదా? అన్నీ తెలిసి వీడిప్పుడిట్లా మాట్లాడు తాడు. ఏం చెప్పాలిక.

మాధ : అప్పిస్తే తీసుకుంటాను. అంతేగాని పిల్లని చేసు కోవాలని ఎక్కడుంది?

కేశ : అదంతా గాదురా, నేను చెప్పినట్టు నువ్వాపిల్లని చేసుకుంటావా? లేదా?

మాధ : ఆ గుడ్డి పిల్లనా?

జగ : గుడ్డి దేమిటీ?

మాధ : ఒక కన్ను లేదులెండి!

కేశ : ఏమోయ్ లేకపోతే! ఇబ్బందా? పిల్లలు పుట్టరా?

జగ : పిల్లలకేం. రెండుకళ్ళూ లేకపోయినా పుడతారు.

కేశ : (జగన్నాధంతో) అది కాదబ్బాయ్. అవతల నీకు మామ — అటు తల్లి చెప్తావుంది. ఇటు నేను చెప్తా తున్నా. ఇంతమంది మాట కాదని నీ వెక్కడికి పోతావో చూస్తా.

మాధ: నాకు బాగా తెలుసు బావా, కనుక నా కొమారికకూడా ఆ పిల్లను పెళ్ళి చెయ్యలేను.

వీర: కేశవయ్యగారూ! అబ్బాయికి అంత ఇష్టం లేక పోతేను.............

జగ: అతనికి ఇష్టంవచ్చిన పిల్లను చేసుకోనివ్వడం మంచిది.

కేశ: ఎక్కడో ఒక కులం చెడ్డది ఉంటే, దాని చెల్లెల్ని వీడు ప్రేమించాడంట. దాన్ని నేను చేసుకోనియ్యనా?

వీర: అంటే.............

మాధ: మరేం లేదండీ, నేను ప్రేమించిన అమ్మాయి అక్కయ్య వితంతు వివాహం చేసుకుంది. అదీ తప్పు.

కేశ: వితంతో ఏ తంతో అదంతా నాకు తెలియదు. మొగుడు చచ్చినాక ఇంకొకణ్ణి చేసుకోవడం సాహసమను నేగా? దాని చెల్లెల్ని వీడు చేసుకుంటాడూ? నేను చూస్తూ ఊరుకోనా! చెప్పండి పెద్దమనుషులు.

[వీరయ్య ముఖం వెల వెలపోతుంది.]

జగ: ఇప్పుడు ప్రతిఊళ్ళో, ప్రతిఇంటా మామూలుగా జరుగుతూనే ఉన్నాయిలెండి. అయినా మీ అబ్బాయి చేసుకునేది ఆమెను గాదుగా, ఆమె చెల్లెల్ని.

వీర: (బాధపడుతూ) జగన్నాథం, పద పోదాం. ఏమిట్రా ఇదంతా?

జగ: ఇంకో సోడా తాగు బావా!

కేశ: ఇప్పుడు సోడా ఎందుకు? పదండి భోజనానికి.

వీర: నే నిప్పుడు భోజనం చేయను లెండి.

కేశ: ఏం?

వీర : ఇవ్వాళ శనివారం సంతెపూట...
కేశ : అట్లయితే మేమిద్దరం తర్వాత వెళ్తాం. (జగన్నాథంతో) మీరిద్దరూ వెళ్ళి భోంచేసెరండి నాయనా.
జగ : సరే.

[జగన్నాథం, మాధవరావు వెళ్ళిపోయినారు.]

కేశ : వీరయ్యగారూ! ఈ కాలపు కుర్రాళ్ళు మాట వినేటట్టు కనబట్టంలేదండీ!
వీర : కుర్రవాళ్ళు ఏవిటిగి, ఆడపిల్లలుమాత్రం వినేటట్లున్నారూ!
కేశ : అసలు వీణ్ణి చదివించటమే తప్పయింది.
వీర : అదేంమాటలెండి. చదువు లేకపోతే పిల్లనియ్యగు. చదువుకుంటే పిళ్ళు మాట వినగు.
కేశ : ఇంతకీ మావాణ్ణి ఏం చెయ్యాలో తోచటంలేదు.
వీర : మనమే ఒక అడుగు వెనక్కి వెయ్యటం మంచిదేమో.
కేశ : ఈమాత్రానికే తగ్గుతానా! వీడి అంతు తేల్చుకోకుండా.

[దళారి ప్రవేశం]

దళా : ఇందాకటి గిత్తలబేరగాడు ఎటుబోయినాడు మావాం.
వీర : ఎందుకు?
దళా : పనుందిలే.
కేశ : ఏమిటో ఆ పని చెప్పవోయ్.
దళా : అత నెప్పుడూ ఎద్దుల మొఖం చూసినట్టు లేదు. బంగారం లాంటి గిత్తని చూపించితే పనికిరాదన్నాడు.
: అదేమిటీ! ఇందాక బేరం కుదిరిందని వాడు చెప్పితే.

దళా : ఏం గొంటే. బేరం కుదిరింది! ఎట్టాకుదిరిందంట, ఎట్టా చెప్పాడంట.

వీర : కుదుర్చుకుంటే కుదిరింది.

దళా : నన్ను అవతలికి పంపి తనే బేరం కుదుర్చుకున్నాడా ఏంటి?

కేశ : ఏమో! ఎవడికి తెల్సు!

దళా : నాకే గురిపెట్టాలనుకున్నాడేం? చూద్దాం. ఆయన నట్టా అమ్ముతాడో - యీయన నట్టా కొంటాడో ఏదీ! ఒక నీసముక్క ఇటు పారెయ్ మావాం. (బీడీ తీసు కుని నిప్పు (తాటికి అంటించుకుంటూ) సరేగాని మావా, మీ బావమరది కూతుర్ని నీ కొడుక్కి చేసుకుందా మను కున్నాగేమో?

కేశ : అనుకున్నాం ఏం?

దళా : ఏం ఏంటి? ఆపిల్లని భద్రయ్యగారి అబ్బాయి కిస్తున్నారు.

కేశ : చాలు - చాల్లే - ఆగు.

దళా : వట్టి దనుకుంటున్నావా?

కేశ : ఎవడా చెప్పింది నీకు?

దళా : ఒకడు చెప్పేదేంటి? నా కళ్లతో నేను చూస్తేను. తాంబూలాలుకూడా తీసుకుంటేను.

కేశ : నిజంగానా?

దళా : కాదంటే వెళ్లిచూడు తెలుస్తుంది. అబద్ధం చెప్పాలని నాకేమన్నా వాగారిందంటావా?

వీర : (కేశవయ్యతో) ఇదేంటి!

కేశ : ఏవిఁటో తెల్చుకుంటూ యిప్పుడే. ఆఁ! వస్తా వుండండి
(వెళుతూ దళారితో) రారా అబ్బాయ్ (అంటూ కేశవయ్య, దళారి వెళ్తారు.)

వీర : (చుట్ట వెలిగించి అక్కడే పచార్లు చేస్తావుంటాడు. ఇంతలో మాధవరావు జగన్నాధం వస్తారు.)

మాధ : (వస్తానే) మా నాన్న ఎటు వెళ్లారండీ?

వీర : భద్రయ్యగా రింటికి.

మాధ : ఎందుకూ?

వీర : మీ మేనమామ కూతుర్ని, అంటే నీ కన్నామనుకున్న పిల్లనీ...

మాధ : ఆయనకు ఇదే ఒక్క అమ్మాయి లెండి.

వీర : ఓహో! ఆ అమ్మాయిని భద్రయ్యగారు తన కొడుక్కి కుదుర్చుకుంటున్నాడట. అదేవిఁటో తెలుసుకొద్దామని వెళ్లారు.

మాధ : అయితే యీయన వెళ్లడ మెందుకు పని లేక!

జగ : (వ్యంగ్యంగా) నీ గురించే.

వీర : యీయన ఆదుర్దాయేగాని (మాధవరావుతో) నీ వన్నట్టు వెళ్లడం అనవసరమే ననుకుంటా.

జగ : నువ్వుకూడా అట్లా మాట్లాడితే ఎట్లా బావా! కాళ్లు బట్టుకు గుంజితే చూరుబట్టుకు వేళ్లాడ్డం మనకు అలవాటేగా.

వీర : (విసుగ్గా) మరీ కట్టలు తెగి మాట్లాడుతున్నావ్. ఇవ్వాళ నీ కేదో పురుగు తొలిచినట్టుంది.

జగ : నాకా! (నవ్వుతాడు)

వీర : ఏంవిటిరా నీ గోపన. అర్థం లేకుండా.

మాధ : ప్రతిమాటకూ అర్థముండాలని ఎక్కడుంది లెండి.

జగ : ప్రతిమాటర్థం మనకు తెలియాలని ఎక్కడుంది ?

మాధ : ఆయనకు చెప్పదల్చుకున్న దేదో స్పష్టంగా చెప్ప రాదూ ! ముసుగులో గుద్దులాట ఎందుకూ ?

జగ : దానికీ సమయాసమయా లుంటాయ్.

వీర : ఏంవిటి వుండేది నీ పెండ్లాకూతురు.

జగ : ఆఁ, అదే అదే.

కేశ : (పరివేశిస్తూ) నీ పంతం ? నీది ప్రభుత కెంత ? చూస్తాను. నన్ను కాదని నీవు బాగుపడి చచ్చేదేంవిటో !

వీర : ఏం జరిగిందండీ ? అతను చెప్పింది నిజమేనన్న మాట.

కేశ : నిజమే – నిజమే – పీడా వదిలింది.

జగ : అంతే, అందని ద్రాక్ష పండ్లు పుల్లన.

కేశ : పిడి గుడ్డకూతుర్ని ఇవ్వకపోతే మావాడికి పెళ్ళి కాదంటావా ?

వీర : కాదని ఎవరంటారు. అసలు మీ బావమరదికే యీ దుర్బుద్ధి ఏంవిటా అనిగాని.

మాధ : మా మామ చాలదూరం ఆలోచించే ఈ సంబంధం చేసుకుని వుంటారు.

కేశ : ఈ వయస్సు వచ్చేవాడు మనల్ని బజారుకు యీడవడ మెందుకు ?

మాధ : ఎక్కడా గతిలేకపోతే ఆ పిల్లని నాక్కడదామనుకున్నాడు. ఇప్పుడు భద్రయ్యగారిలాంటి వియ్యంకుడు దొరికేసరికి ప్లేటు ఫిరాయించాడు. అంతే.

జగ: అదీ కట్నకం.

వీర: అయినవాడనీ లేదు, కానివాడనీ లేదు. ఎకరాల్ని నమ్మటానికి వీలు లేకుండా వుంది.

జగ: ఎకరాల్ని నమ్ముకున్నవాడా.

మాధ: అదేగా భద్రయ్యగారు చేసిన పని.

జగ: ఆయన కట్నం తీసుకోడుగా!

మాధ: ఎందుకు కట్నం? మా మావయ్యకు ఎకరాలుండే. ఒక్కటే కూతురు, మగపిల్లలు లేరు.

వీర: ఎకరాలు రాగానే సరా! పిల్ల ముక్కూ మొగమూ, మంచీ – చెడూ చూడక్కర్లేదా?

జగ: పిల్లవాడి మంచీ – చెడూ మనకు కావాల్సివచ్చిందీ! పిల్లనుగురించి వాళ్ళు ఆలోచించటానికి.

మాధ: అందుకనే "తప్పులెన్ను వారు తమ తప్పు లెరుగరు" అన్నాడు వేమన.

కేశ: అంటే?

మాధ: అంటే కుమారుడు ప్రేమించిన పిల్లను కాదని, ఆస్తి కోసం గుడ్డిపిల్లను అంటగట్ట జూచేవారొకరూ...

కేశ: (బిగ్గరగా) మాధవా.

జగ: అంతేగాదు, యువకుడు ఎంత యోగ్యుడైనా అతని తండ్రి కూరగాయలబేరం చేస్తున్నాడు గనుక, తన కూతుర్నివ్వని ఘరానా తండ్రీ యింకొకడు...

వీర: (బిగ్గరగా) జగన్నాథం.

జగ: (వ్యంగ్యంగా నవ్వుతూ) గుమ్మడికాయల దొంగలు!

మాధ: భాగ్యాలు పాపముగుంటున్నాన్నా.

కేశ: ఏం, నిజం చెప్పగూడదా.

వీర: ఆఁ.

కేశ: నాకు తెలుసు కనుక్కుంటాను. ఒకడు మాచేతిక్రింద Gంజి పిల్లి తాగిస్తుంటే, కుంభకోణం వ్యాపారం చేస్తుంటే తప్పా?

వీర: అసాం, అది కాదు. గుమాస్తాగిన్న ఎధనపిల్లను ఇంట్లో పెంచుకుని ఎళ్ళాలం చదువుస్తూ కూర్చ్న్నేకం కి తగిన వరుడికి ఇచ్చి పెళ్ళిచేస్తే తప్పా?

మాధ: ఏదీ తప్పుగాదు.

[దళారి ప్రవేశం]

దళా: (జగన్నాధంతో) ఏమయ్యా? నాకు కమీషను ఇవ్వ కుండా పోతుందని గిత్తను నువ్వే కుదుర్చుకుంటావ్. బలేవాడివే మొత్తానికి.

జగ: ఏం, నువ్వు చూపించిన గిత్తనే కొనాలనుందా?

దళా: ఓయ్, నేను చూపించకుండా ఈ ఊళ్ళో నీకు గిత్త నమ్మే దెవడయ్యా.

జగ: నేనే చూసుకున్నా – నేనే కొనుక్కున్నా.

దళా: ఎక్కడుందా గిత్త?

జగ: ఇక్కడే.

దళా: ఇక్కడా! ఎక్కడయ్యా?

జగ: ఇదిగో! (అంటూ మాధవరావుకు షేక్ హాండ్ యిస్తాడు.)

దళా : (నవ్వి) ఓ, సో, స్. బతే గిత్తలబేరము. నాకు సచ్చి మీరిద్దరూ పెడపెడగా గుసగుసలాడింది యిదా? (కేశవయ్యవైపు తిరిగి) ఏఁ మావో! నీసని ఇష్ట్.

కేశ : (తెల్లపోయి) ఏఁవిటోగో ఇదంతా వూజుగా ఉంది.

జగ : మా పెద్ద మేనగోడలేనండి రెండో పెళ్ళి చేసంగి. అంటే మా వీరయ్య బావ కూతురుగే.

కేశ : అట్టాగా?

జగ : ఆఁ, ఆ పిల్ల, చెల్లెళ్ళే మీ అబ్బాయి ప్రేమించింగి.

కేశ : సరి సరి.

వీర : మన అమ్మాయిని యీ అబ్బాయి ఎప్పుడు చూశాడురా!

జగ : మాధవరావు చెడుగుడులో పోంచి ప్లేయరు. మేం యిద్దరం ఒకటీములోనే ఆడుతూవుంటాం.

కేశ : ఆఁ.

జగ : మన వూళ్ళో ఆటల పోటీలు జరగలా బావా?

వీర : ఊఁ, జరిగినయ్.

జగ : అప్పుడు యితను మా యింటికి వచ్చాడు.

వీర : ఆఁ, వస్తే!

కేశ : ఏముంది అబ్బాయిని అమ్మాయి, అమ్మాయిని అబ్బాయి చూసుకుని వుంటారు.

వీర : మరి అయితే నాకు చెప్పలేదేఁరా?

జగ : నువ్వు వింటేనా? అక్కయ్య చెప్పబోతే మండిపడి ఇటు బయలుదేరావ్.

ప్రదేశం:

డెల్టా ప్రాంతంలో ఒక పల్లెటూరు

సమయం:

ప్రొద్దు ఎర్రలు కోలుతూ వుంటుంది

పాత్రలు:

గోపాలరావు
మల్లయ్య
గురవయ్య
కోటయ్య
అప్పయ్య
రంగదాసు
పిల్లవాడు

# జీతగాడు

[భూస్వామి గోపాలరావు ఇంటిముందు తలవాకిడి. మధ్యలో ఒక మంచం వాల్చి వుంటుంది. ప్రక్కగా ఒక బల్ల. బల్లమీద గోడ్డలి. భూస్వామి ఖద్దరుదుస్తులు ధరించివుంటాడు. చిన్నమీసం, క్రాఫు, బట్టతల, వయస్సు 40. గోపాలరావు మంచంమీద కూర్చుని లెక్కలు చూసుకుంటూ వుంటాడు.

మల్లయ్య ప్రవేశం, వ్యవసాయకూలీ. మాసినగడ్డం, కాళ్ళకు చెప్పులు, చేతులో కర్ర, కట్టుకున్న నీర్కావిపంచ చినిగిపోవడంవల్ల అక్కడక్కడా కుట్టి వుంటుంది. ఒక చింపిరిగుడ్డ తలకుచుట్టుకుని వుంటాడు. వయస్సు 55. శక్తికిమించి పని చేయడంవలన వయస్సుకు మించిన వార్ధక్యం అతని ముఖం మీద ప్రస్ఫుటమౌతూ వుంటుంది. శరీరమంతా కీళ్ళు వేళ్లాడుతూ వుంటాయి. దగ్గుతూ స్టేజీలోకి ప్రవేశిస్తాడు.]

గోపా : (అటు చూడకుండానే) ఎవరు?

మల్ల : నేనేనండి, మల్లాయిని.

గోపా : ఓహో, నువ్వా, బొత్తిగా దర్శనాలే లేవే.

మల్ల : తీరటం లేదండి.

గోపా : అంత తీరిక లేకుండా వుందా! అయితే సంపాదన అంతా ఎక్కడ పోస్తున్నావ్?

మల్లి : ఏం సంపాదనో లే ఏరా ! ఏది కొనుగోలుకైనా మండి పోతావుంది. ఎట్టా బతుకుతామో, ఏంటో.

గోపా : బ్రతక్క మీకేమోయ్ ! మాకంటు పరాసనే వాలుగా వుంది.

మల్లి : అట్టాగే అంటారు మీరు.

గోపా : (వింగులోనుంచి లోనికి చూస్తూ) అరె మల్లమ్మా ! అదిగో, ఆ దూడ చూడు! జనపకట్టలన్నీ పాడుచేస్తావుంది. కాస్త దాన్ని కట్టేసిరా అమ్మ.

మల్లి : (లోనికిపోయి అక్కడనుంచి బిగ్గరగా) తాడెక్కడుంది దొరగారు ?

గోపా : (చేతిలోని లెక్కల పుస్తకం కిందపెట్టి ముందుకు వంగి వేలు అటుచూపుతూ) అదుగో నీ వెనకాల స్తంభానికి. తమ్మి కాస్త బిర్రుగా పెట్టు. జారతీసుకుంటుంది.

[తిరిగి పుస్తకం అందుకుని లెక్కలు చూసుకుంటూ వుంటాడు.]

మల్లి : (ప్రవేశించి) ఎంతసేపైందో, వూడతీసుకుని, జనప కట్టె అంతా తొక్కేసిందండి.

గోపా : పుట్లకుపుట్లు కొలిచి పాలేళ్లను పెట్టుకున్నా, ఏం లాభం. చూడు ! ఎంత చక్కగా తెగబడిందో పని.

మల్లి : మెడపలుపు జారతీసుకున్నట్టుంది.

గోపా : సరేగాని పేళ్లుబొత్తిగా లేవు. పాలేళ్లు ఇంకా రాలేదు. ఆ గొడ్డలందుకొని నాలుగు పేళ్లు తియ్యరా.

మల్లి : చీకటిపడింది. సూపు సరీగా ఆనదు దొరగారు.

గోపా : ఆఁ, ఏపాటి. నాలుగు తీద్దూ.

[పిల్లి చుట్ట [illegible] కాలుస్తూ గోపాలం [illegible] కుంటాడు. కుంటి మేస్త్రి గురవయ్య ప్రవేశిస్తాడు. [illegible], [illegible] వేసుకుని వున్నాడు. [illegible] నలిగిపోయినట్టుగా వంకర తలగుడ్డ చుట్టుకున్నాడు. [illegible] [illegible] చేతిలో కర్ర వుంటుంది. వయస్సు 35 సంవత్సరాలు.]

గోపా : ఏంరా, ఎన్నిసార్లు కబురంపినా, ఎక్కడా అంతు లేవు.

గుర : ఇంటికాడ లేనండి.

[గోపాలం పిల్లి చుట్ట [illegible] తీసుకుని వేసే గొడ్డలి డబ్బాలో [illegible] అప్పు [illegible] విప్పదీస్తూ వుంటుంది.]

గోపా : [illegible] గంటలు గా నా కాణంలోనే అన్న మాట నీ పని.

గుర : నా కాణం లేదు, సారూ లేదు. డబ్బు లుండాల్గదా.

గోపా : నీకు డబ్బులు ఏం కరువురా ! ఇటు మా దగ్గర మామూలు కాజేస్తావు. అటు కూలీలదగ్గర కమీషను కొడతావు.

గుర : అయ్యన్నీ ఎనకటి రోజులు. ఇప్పు డెవ డిస్తాడండి ?

గోపా : అవును ఇప్పుడు అంతా మేస్త్రీలేనా రేం. ఇంకా పనిచేసేది ఎవరు ?

గుర : బలేమాట చెప్పారు. అసలు వాళ్ళకి పట్టపగ్గాలు లేకుండా వున్నయ్.

గోపా : అయితే, వ్యవహారం ముదిరిందన్న మాట !

గుర : ముదరటం ఏంటి. రేపు మీ బాకీలైనా తీరుస్తారో లేదో మరి.

గోపా : గింజలు కావలసినవాడు గింజలూ, డబ్బు కావలసిన వాడు డబ్బూ నా దగ్గర రెండు నెలలనాడే కాజేశాడు. ఇదంతా ఎవడి అమ్మా మొగుడుసొమ్ము తీగ్గ్రకపోవ డానికి.

గుర : అందరికిమల్లే, మీకు కూలియిస్తే నస్తారేమో గేప్ప మన వూడుపుకి.

గోపా : తక్కువకూలికి వస్తామని ముందు నా దగ్గర డబ్బూ, గింజలూ కాజేశారుగా మరి.

గుర : కావలిస్తే మీ డబ్బుకు వడ్డీ ఇస్తారంట. అంతే గాని......

గోపా : ఈ యేడుపు మొదటే ఏడవలేకపోయాగూ ? ముందుకు ముందు కాజేసి, తరువాత ఆడిట్టా మనుకు న్నారేం ? పక్క లిరగతన్నిస్తానని చెప్పు.

గుర : కూలీ సంగమంటూపెట్టి, మారంగడాసు తెచ్చిపెట్టాడు అసలు ఈ పీడంతా.

గోపా : పెడతాడు పెడతాడు. గోవు లేనివూళ్లో గాడిదే గోవు శివాలక్ష్మి అన్నట్లు వీడొక మొనగాడయ్యాడు, ఈ వూళ్లో.

గుర : అసలు వాడికి కిందూమీదు తెలుస్తావుందా ?

గోపా : నేను రమ్మన్నానని వాణ్ణి ఇట్టా తీసుకురా. తేలు స్తాను, ఆ సంగతి ఏమిటో, సంఘం ఏమిటో.

గుర : ముందుగా మనమే, ఎగ్గెంపెట్టి రంకు తెలుపుకోటం ఎందుకు ? పదిమందితోపాటే లెమ్మందాం. పని పూర్తి

అయినాక, మన మామూలు పేకాటం, లెక్కలు కడదాం.

గోపా : భలే ఆలోచన చెప్పావురా. సరేగాని అట్టా దివాలా తీసేస్తున్నావేం? ఇవ్వాళ ఆ నీళ్ళు కాసినీ ఇంకా నోట్లో పడలేదా?

గుర : ఊఁ... చేతులో సిక్కలుంటొద్దూ?

గోపా : నీ మొహం. ఈ యేడుపు ముందే ఏడిస్తే. ఊఁ ఇదుగో. (జేబులోంచి రూపాయితీసి గురవయ్యమీద పారవేస్తూ) అరే గురవాయి! రంగదాసునుమాత్రం వెంటనే తీసుకురా. వేరే పని వుంది లే, తరువాత చెప్తాను వెళ్ళు.

గుర : నేను పిలిస్తే ఒక అందాన రాదండి. మరి ఎవరినైనా...

[ఇంతలో గొడ్డలి, పేళ్ళతో మల్లయ్య ప్రవేశం]

గోపా : (మల్లయ్యవైపు చూచి) సరే, నీవు పోరా గురవాయ్. అది నేను చూచుకుంటాను లే.

గుర : (మల్లయ్యవైపు చూచి) పోదాం వస్తావా, మామా?

గోపా : నీ ఏడుపు నీవు ఏడవరా, వాడి గొడవ నీ కెందుకు?

మల్ల : (గొడ్డలి, పేళ్ళూ మూలపడవేస్తూ) నువ్వు పదరా అబ్బాయ్. కాత్తి ఎనకాముందుగా వత్తాను.

గుర : సరే (వెళతాడు).

మల్ల : ముడికట్టె. పగిలి సావలేదండి. మా యాతనపెట్టింది.

గోపా : దాని పాడుగాను, పగలకపోతే వదిలిపెట్టకపోయావ్. ఎందుకు అంతగా రెక్కలు విరుచుకున్నావ్. కాకపోతే పొద్దున్నే పాలేళ్ళే పగలేసేవాళ్ళుగా?

మల్ల : ఏదోలెండి, అయిపోయిందిగా.

గోపా : సరేగాని, మంచినీళ్లు తాగుతావా ?

మల్లి : ఎందుకులెండి.

గోపా : (బిగ్గరగా) ఎవర్రా ఇంట్లో ? (గోపాలరావు కేక విని ఇంట్లో పనిచేసే పిల్లవాడు ప్రవేశించుతాడు) భోషాణం మీద పొగాకుపట్టా వుందిగాని, ఇట్టా తీసుకురారా. (తల వూపుతూ ఆ పిల్లవాడు వెళ్లిపోతాడు). దీని పాడుగాను మల్లాయ్ ! పొగాకు మంచిదిదేగాని, అనాపెట్టినా ఒకట్ల కాడ రావడంలా. కష్టపడ్డాన్, ముండాకొడక ! కసుమీకి పొగాకు పెడతావుండు. ఇంతకీ వచ్చినపని ఏమిటో చెప్పావ్ కాదు ?

మల్లి : మరేం లేదుండి (చెప్పడానికి అనుమానిస్తాడు).

గోపా : చెప్పరా, చల్లకొచ్చి ముంతదాయడం ఎందుకు ?

మల్లి : ఊడుపుల్లో తీసుకుంటా. ఐదు రూపాయలు సొమ్ము పెట్టండి.

గోపా : ఎందుకు ?

మల్లి : పిల్లగాడి జీతానికి. ఈయేడు సదివితే మన స్కూలు సదువుమట్టుకి ఒడ్డెక్కుతుంది.

గోపా : ధర్మఘోరం ఏడుస్తున్నా డన్న మాట.

మల్లి : ఆఁ, అదేనండి. రేపు జీతం కట్టకపోతే, పేరు కొట్టేత్తా మన్నారంట.

గోపా : మా వాడూ, బి. ఏ. దాకా మిణికాడు. ఏం లాభం, అందునా ఇందునా కాకుండాపోయాడు. ఇక నీ కొడుకు చదువుకుని వుళ్ళు ఏల్తాడూ !

గోపా : ఒరే, మల్లాయ్ ! రంగదాసుని నేను రమ్మన్నానని
    చెప్పరా.

మల్లి : చిత్తం – (వెళ్లిపోతాడు).

[గోపాలరావు తన జేబులోని గోలుసంచి తీసి అందు లోసి మంచిపుగాకు చుట్ట చుడతాడు. జేబులోనుంచి అగ్గి పెట్టితీసి చుట్ట ముట్టిస్తూవుంటాడు.]

[కోటయ్య ప్రవేశం. గోపాలరావు పాలేరు. చిరుగుల చొక్కా, పంచెలూ మురికిగా వుంటాయి. తల రేగి వుంటుంది. అలసట చెందివుంటాడు. వయస్సు 30 సంవత్సరాలు, పై పంచెతో ముఖంమీది చమట తుడుచుకుంటూ వస్తాడు.]

గోపా : ఏరా, కోటిగా ! తడిపెందా ఆకుమడి ?

కోట : తడిసేదేకాని, ..........

గోపా : ఇంతకూ, తడవ లేదా ?

కోట : తొండం పగిలింది.

గోపా : ఓరి, నీ వ్యవసాయం తగలబడ. ఎట్టాగంటు, ఈ
    గాడిదకొడుకులతో చచ్చేది.

కోట : తొండం పగిలితే, నే నేం చెయ్యను, నాగోలు
    అతుకెయ్యనా !

గోపా : (కోపంగా) కొత్త తొండం, ఒక్క తడికూడ తిరగ
    లేదు, అప్పుడే ఎట్టా పగిలిందిరా ?

కోట : ఊఁ, నేను పగలగొట్టా ?

గోపా : పగలగొట్టకపోతే, తొండం తొండు ఇనుసున పడింది కాసకుండా గోలిపెట్టాన్.

కోట : అట్టాగోలబట్టే, పూరందరి మళ్లీకన్నా మన ఆకు మడి ముందు ఏత కొచ్చింది.

గోపా : ఊఁ, నీచేతి చలవ.

కోట : ఎందుకులెండి, చేశేవాడూ లేదు, చెయ్యనోడూ లేదు, గుర్రాన్ని, గాడిదను ఏకంచేస్తారు. కడుపు మాడుసుకుని పనిచేసినా మెప్పు లేదు.

గోపా : ధర్మానికి చేస్తున్నావ్, మెప్పు లేదు.

కోట : లేకపోతే, ఏంటుండి ? రాత్రి గింజలడిగితే, పొద్దున్నే రమ్మంటిరి. పొద్దున 'ఆడది' వస్తే శుక్రారం అన్నారంట, ఏంతిని చెయ్యమంటారండి ?

గోపా : దొరసాని వచ్చిందని వారం వర్జం లేకుండా గింజను కొల్చి పంపించమంటావ్, అంతేనా ?

కోట : పస్తులుండి పని చెయ్యమంటారు. మీకేం, చాకిరీ చేయించుకోటానికి ఏ వారమూ లేదు.

గోపా : పనిమాట ఎట్లావున్నా, బూకరింపులు మాత్రం బాగానేర్చావ్. పో, పో, ముందు ఆ ఎడ్లమందకు దానా పెట్టు.

కోట : ఆటికి ఎట్టానూ పెడతాలెండి. మరి నా దానా సంగతో ?

గోపా : ప్రొద్దున్నే చావమను దాన్ని.

కోట : పొద్దున్నే (అంటూ గొణుగుతూ పోతాడు).

[అప్పయ్య ప్రవేశం. పేదరైతు, మాసిన దుస్తులు, తలగుడ్డ, బక్కపల్చగా వుంటాడు. సింహమీసం, కొద్దిగా మాసినగడ్డం, వయస్సు 40.]

గోపా : కూర్చోవయ్యా అప్పయ్యా ! (బల్ల చూపుతాడు).

అప్ప : ఎందుకు రమ్మన్నారంట ? (కూర్చుంటాడు).

గోపా : ఎందుకైనదీ తెలియదా ?

అప్ప : తెలిస్తే అడుగుతానా ?

గోపా : అంత మతిమరుపా ? వెంటనే పైకం కావాలని మొన్న చెప్పలా ?

అప్ప : నేనూ ఆలోచిస్తానే వుండా. ఎక్కడా దొరకలా మరి.

గోపా : నా దగ్గర అప్పుతీసుకుని రెండేళ్లయింది. ఇప్పటికి కానీ వసూలు లేదు. దొరకమంటే, ఎక్కడ దొరుకుతుంది. తీసుకునేటప్పుడు వుండే జోరు, తీర్చేటప్పుడు కూడా వుండాలి మరి.

అప్ప : ఎట్టాగైనా ఈ అప్పు తీరుద్దామని నేనూ తంటాలు పడతానే వుండా. నాలుగుడబ్బులు కూడబెట్టేసరికి ఏదో ఒక మిడిమేళం వచ్చిపడతానే వుంది.

గోపా : అందరికీ వుంటాయి ఇబ్బందులు, నీకే కాదు.

అప్ప : నిజమే కాని......

గోపా : కానీ లేదు, అర్ధణా లేదు, నాలుగురోజుల్లో నా డబ్బు నాకు కావాలి.

అప్ప : (వినయంగా) నాలుగురోజుల్లో ఎక్కడ తెమ్మంటారు, గోపాలరావుగారు? మీకు తెలవకుండా ఏముంది?

గోపా : తెలుసు, తెలుసు. అదంతా ఎందు కెప్పావు. నాలుగురోజుల్లో, పైకం ఇవ్వకపోతే కంప్లయింటు చేస్తా, తప్పదు. ముందుగా చెప్పడం, ఎందుకైనా మంచిదని వినిపించాను. తరవాత నీ ఇష్టం (అంటూ లేచి చిరబుర లాడుతూ వెళ్ళిపోతాడు).

అప్ప : ఆఁ, కంప్లైంటా! (నిర్విణ్ణుడై గోపాలరావు పోయిన వైపుకు చూస్తూ నుంచుంటాడు. రంగదాసు ప్రవేశం. వ్యవసాయకూలీ సంఘ ఆర్గనైజరు. చిన్న క్రాపు, మీసం హాఫ్‌షర్టు, ధోవతి, తుండు, వయస్సు 25, చదువు కున్నాడు.)

రంగ : ఎవరు? (అప్పయ్య వెనుకకు తిరిగి చూస్తాడు) ఓహో, మీరా! బోపల గోపాలరావుగా రున్నారా?

అప్ప : (నిట్టూర్పు విడుస్తూ) ఆ, వున్నాడు, ఎందుకు?

రంగ : తెలియదు – ఎందుకో మరి, రమ్మని కబురంపించారు. మీ రేం పనిమీద వచ్చారు?

అప్ప : ఏం చెప్పమంటావ్ రంగదాసూ?

రంగ : చాల కష్టంగా మాట్లాడుతున్నారు. ఏం జరిగింది?

అప్ప : నా కూతురి పెళ్ళికి కొంతా, నిరుడు మా ఇంట్లో జబ్బు పడ్డప్పుడు కొంతా అప్పుపెట్టాడు. ఉన్న కొంచెం, తాకట్టు పెట్టించుకున్నాడు.

రంగ : అవును, అదంతా నాకూ తెలుసు. ఇంతకూ ఇప్పు డేమంటున్నారు?

అప్ప : "నాలుగు రోజుల్లో నా డబ్బు నాకు కక్కు–" అంటు న్నాడు.

రంగ : పాపం.........

అప్ప : పాపం లేదు, పున్నెం లేదు, అట్టా చెల్లించకపోతే కంప్లెంటు చేస్తాడంట.

రంగ : ఇందులో పెద్దఆశ్చర్యం ఏముంది లెండి. అప్పుడు మీరు నాతో ఈ విషయం, సంప్రదించారు. నేను తాకట్టు మాత్రం పెట్టనద్దన్నా. మీరు వినలా.

అప్ప : నిజమే, చెప్పావ్. అప్పుడు నా బుర్రకు ఎక్కలా. తెల్లగా వుండేయన్నీ పాలే అనుకున్నా. ఈయన చెప్పిన తియ్యతియ్యని మాటలు నమ్మా. బొందలో పడ్డా. నేటికి...

గోపా : (ప్రవేశించి) ఇద్దరూ, చెవులు కొరుక్కుంటున్నారు. ఏమిటి కథ ?

రంగ : మీరు కంప్లెంటు చేస్తామన్నారట. ఆసంగతే...

గోపా : ఇదీవరస, అప్పుడే నన్ను ఎండవేయడం మొదలు పెట్టాడూ !

అప్ప : ఇందులో నేను ఎండేసే దేముంది !

గోపా : కాకపోతే ఏమిటిది ? రెండేళ్లనాడు కాంతుగు పెండ్లి అని దేవురిస్తే నాలుగు వందలిస్తిని. నిరుడు పెళ్లాం చచ్చే టట్లుందని కాళ్లావేళ్లాపడితే, రెండు వందలిస్తిని. ఇదుగో నని దమ్మిడీ ఇచ్చావ్, ఇంతవరకు?... దమ్మిడీ ?

రంగ : ఇవ్వక, ఏం చేస్తారు లెండి.

అప్ప : ఈ యేడు ఏదో నాలుగు పుట్ల గింజలైనయ్. చాలినా చాలకపోయినా, మూడు పుట్ల గింజలు తిండికి వుంచుకుని, ఒక పుట్టిగింజలు అమ్మి, వసూలిద్దాం గదా అనుకున్నా.

గోపా : కోడలు కొనుక్కుంటానంటే వద్దనే అత్త వుంటుందా ! అంతమాత్రం పుణ్యమా ! ఇప్పు డిప్పు. కాదన్నానా ?

అప్ప : గింజ మిగలకుండా ప్రెబుత్వం పోసుకు పోయ్యిందిగా.

గోపా : పోదుమరి! ప్రభుత్వంవాళ్లు వచ్చినప్పుడు, 'అయ్యా' 'బాబూ' అని బతిమాలుకుని వొడ్లున పడాలి. కాని, ఎదురుతిరిగితే వూరుకుంటారా మరి.

అప్ప : ఎవరు ఎదురు తిరిగింది ?

గోపా : ఎవరా ? మీరు. సంగినాదం ఇవ్వ లేదు, జీలకర్ర ఇవ్వ లేదు అంటూ ప్రభుత్వాన్ని సాదించారు. మీ సాదింపు లన్నీ పడటానికి అదేమన్నా అత్తగారిల్లా. వాళ్ల చేతనైన పని వాళ్లూ చేశారు.

రంగ : "మాకు కావలసిన వస్తువులను సరియైనధరకు ఇప్పిం చండి" అని అడిగాను. దీన్ని సాదించటమంటారా ?

అప్ప : ఏం చేస్తాంలే రంగదాసూ ! శ్రీరామా అంటం కూడా, "బూతు" అయింది నేటికి.

గోపా : ఈ రంగరామాయి కీదురదంతా ఎందుకంట... ఆ కాంగ్రెసులోనే చేరితే, ఏ పీడా వుండేది కాదుగా.

అప్ప : చేరక నేనుమాత్రం ఏంచేశాను ! మొన్న నా వోటు కూడా కాంగ్రెసుకే ఇచ్చాగా.

గోపా : ఓటు ఇవ్వగానే సరిపోయిందా ఏం ?

అప్ప : ఇంకేం చేయను, అంతకంటె.

రంగ : గోపాలరావుగారిలాగా మీరుకూడా, పోలీసులకు విందుచేస్తే సరిపోయేది.

అప్ప : తనకు దారిలేదు, లంజకు సంచదారంట. నే నెక్కడ తెచ్చేది బాబు?

గోపా : ఈ గొడవ అంతా దేనికి, మొన్న గవర్నమెంటు వారు డబ్బు ఇచ్చారుగా, (చెయిచాపి) ఇట్లా తే.

అప్ప : నా నాలుగుపుట్లకూ వాళ్లిచ్చిన డబ్బు పెట్టి దొంగ మార్కెట్టులో తిండిగింజలు కొంటే మూడుపుట్లు రాలా.

గోపా : రంగదాసూ! ఇతనికి ఏమైనా విశ్వాసం ఉన్న దంటావా? అప్పొసప్పొ ఇచ్చేవాణ్ణి నేను, ఆ కొనే ధాన్యం నాదగ్గర కొనగూడదు?

రంగ : పాత అప్పుక్రింద జమకట్టుకుంటారని భయపడ్డాడు లెండి.

గోపా : ఇదంతా నాకు తెలుసు. అందుకనే ఏమైనా తగిన సలహా...ఆఁ, నా కెందుకు వచ్చినగొడవలు పోనీ.

అప్ప : మీ మాట ఏది కాదన్నాను?

గోపా : మరొకరికి అయితే యెప్పుడో తగిన సలహా ఇచ్చే వాడిని.

రంగ : అప్పయ్యగారు ఏం పాపం చేసుకున్నారు? వీరికి మాత్రం ఎందుకు సలహా ఇవ్వకూడదు?

గోపా : ఊఁ, అప్పు పెట్టింది నేనేగా. మంచికిపోతే చెడు ఎదురౌతుందేమోనని.

అప్ప : మీ మాటకు ఎప్పుడు ఎదురుచెప్పానో చెప్పండి? వెనుక జమీందారుకు ఓటు యివ్వమంటే యిచ్చా, మొన్న కాంగ్రెసుకు ఇస్తేగాని వీల్లేదంటే, సరేనన్నా.

గోపా : నీ వల్లకాదు. నీవు మునగకుండా, నేను నష్టపడకుండా వుండేమార్గం ఏదా అని నేను ఆలోచిస్తున్నాను.

రంగ : [illegible] అంటుగా ఒకటి వుంటుందా ? సరే [illegible], [illegible] చెప్పండి.

గోపా : ఊరుకోండి [illegible] జీతమా స్వల్పం; కుటుంబమా పెద్దది. గంపెడు పిల్లలు. కష్టపడి పది రూపాయలు వెనక వేసినా, మనకో ఒక ఖర్చు ఎదురు చూస్తూనే వుంటుంది.

రంగ : [illegible] పద్దతి అనుకుంటాను.

గోపా : అందుకో నేను చెప్పేది ఏముంది ? అప్పుడు సమయానికి నాదగ్గిర డబ్బు లేకపోయింది. పీటలమీద పెండ్లి గదా అని, నేనే ఒక వోట నోటు వ్రాసి పైకం తెచ్చి ఇచ్చాను. వాడు మున్నె నాదగ్గిర గోళ్ళూడగొట్టి మరీ వసూలు చేశాడు. నామాట అబద్ధమేమో అడుగు.

రంగ : అది గేనె ఏముంది లెండి. తెల్ల బియ్యం, పాటిమానిక. ఏదైనా ఒకదరి పట్టించేమార్గం వుంటే చూడండి.

గోపా : (కొంచెం ఆలోచించి) అసలు ఫాయిదాతో నా లెక్కేయే షుమారు వెయ్యికి దేకుతూవుంది.

అప్ప : (ఆశ్చర్యంగా) వెయ్యా !

గోపా : ఇట్లాగే చూస్తూ వూరుకుంటే వెయ్యి అవుతుందా, వెయ్యిన్నర అవుతుందా !

రంగ : దాని కేముంది లెండి. లెఖ్ఖ వుందిగా.

గోపా : ఎందుకు లేదు. అద్దంలాగా వుందే. (అప్పయ్యవైపు తిరిగి) అప్పయ్యా, రుణం తీరి స్తే పోతుంది. రణం కో స్తే పోతుంది. ఎందుకుగాని, నేను చెప్పినట్లు నడుచుకో.

అప్ప : చెప్పండి.

గోపా : ఆ రోజు కారోజు భూమికి ధర పడిపోతూవుంది. ఇంకా ఒక్క సంవత్సరం ఇట్లాగే గడిస్తే, నీ రెండెకరాలూ నా అప్పుకే సరిపోదు. ఇప్పుడు ఆభూమిని అమ్మావా, అప్పుతీరగా, ఇంకా కొంత మిగులుతుంది; ఆ డబ్బుతో బుడమేటిబిడ్డున అయితే మళ్లీ ఇంతపొలమూ అమురుతుంది.

అప్ప : అట్టా చెప్పండి! ఈ ముసుగులోగుద్దులాటంతా ఎందుకు? ఆ గడ్డ కాస్తి మీపేర రాయమంటారు. అంతేనా?

గోపా : రాయకపోతే వుంచుకోవయ్యా! నా కున్నది, చేసే దిక్కు లేదు. నీదాని కెవడు ఏడుస్తున్నాడు. నా డబ్బు నాకు పారెయ్యి. అందులో ఇప్పుడు భూములు పంపకాలంటున్నారుకూడ.

రంగ : ఈ చల్లని ప్రభుత్వం వుండగా మీ కాభయం అక్కరలేదులెండి గోపాలరావుగారు.

గోపా : గొడ్లకు మేత సదరక, ఇట్లా చచ్చావ్ ఎందుకు?

కోట : సదరటమూ అయింది, అన్నీ అయిన్నై. కొంపకు పోతా.

గోపా : ఉండుండు, పోదువుగాని. (రంగదాసువైపు తిరిగి) సంఘం పెట్టింది, మా మీద దాడిసాగించడానికేనా? (పాలేరువైపు వేలుచూపుతూ) లేక ఇల్లాంటివాళ్ళకు కూడా, ఏదైనా బుద్ధి చెప్పడం వుందా?

రంగ : ఏం చేశాడు?

గోపా : అడుగు, వాడినే అడుగు.

గుర : (త్రాగి, తూలుతూ ప్రవేశించి) మాట్లాడవేరా ఎదవ నాయాల?

రంగ: ఏం జరిగింది, కోటయ్యా ?
కోట: ఆయనగారికే తెలవాలి. ఏంతప్పు చేశాను చెప్పటానికి.
గోపా: ఏమీ చెయ్యనే లేదా ?
కోట: ఏం చేశాను ! తిండి లేకపోయినా పనిచెయ్యటానికి వచ్చా.
అప్ప: ఇది ఎట్టాంటితప్పు !
గోపా: అది తప్పు ఎందుకు అవుతుంది, దొంగతనం చేస్తే తప్పుగాని.
కోట: (ఆశ్చర్యంగా) దొంగతనమా !
అప్ప: ఏమోనబ్బా నేను నమ్మను. ఇదివరకు కోటాయి దగ్గర ఈ పాడుబుద్ధి లేదనుకుంటాను.
గుర: మీకేం తెలుసునండి.
గోపా: ఇదివరకు ఆ బుద్ధిలేని మాటనిజమే. కాని ఇప్పుడిప్పుడే మొదలు పెట్టాడు. ఏమయ్యా ! అప్పయ్యా ! దొంగతనం తప్పా కాదా ?
అప్ప: చేస్తేతప్పే; కాదని ఎవ డంటాడు. అయినా ఏరా కోటాయి ! ఈ పాడుబుద్ధి నీకు ఎట్టా పుట్టిందిరా ?
గోపా: ఈ మధ్య కొత్తగా కూలీసంఘంలో చేరాడులే. అప్పటినుంచి సాగించాడు.
గుర: అదా ! సంగతి !
అప్ప: కూలీసంఘం పెట్టినాక దొంగతనాలు తగ్గినై అనుకున్నాం, మళ్ళీ సాగినై !
రంగ: ఇంతకీ చేసినదొంగతనం ఏమిటో చెప్పరేం !

గోపా : నారుమడి పోసినప్పుడు, ఒక మడి గోంగులు కూడ చల్లించాను. చక్కగా ఎదిగినై, కూర నవనవలాడుతూ వుంది.

అప్ప : ఔను, నేనూ చూశాను.

గోపా : గోంగూర అంటే మా ఆవిడకు చాలా ఇష్టం. కోయించుకొచ్చి పచ్చడి పెట్టిద్దాం అనుకున్నాను.

రంగ : ఊఁ.

గోపా : మొన్న పుటికెడని మూలెడుకూర అయితే, కోసుకు పోయింది వీడి పెళ్ళాం.

కోట : తల్లి ముండమొయ్య, పిడికెడు గోంగూర కోసక పోవటంకూడా దొంగతనమేనా !

అప్ప : ఆ కోసికెళ్ళేది, అడిగే కోసుకపోక పోయూవట్రా !

కోట : ఏంటండి దొరగారూ ! మీరూ అట్టాగే అంటారు ? మొన్న మిమ్మల్ని అడిగితే మూలెడుకూర పెట్టెలామీరు. గోంగూరకూడ అడగాలా ?

గుర : గోంగూర అయినా, దొంగతిసం దొంగతనమే.

కోట : పోరా; తాగుబోతు లంజకొడక! నువ్వొచ్చి చెప్పొచ్చావంట !

గుర : అరె, డొక్క చీల్చేస్తరోయ్. తాగుబోతు లంజ కొడుకునా ! రేపు కులంలో పెడతా, ఉండు నాయాలా!

గోపా : అరె, గురవాయ్ ! ముందు నువ్వు అవతలకి పోరా.

గుర : శాస్త్రి పుగాకు ఇట్టా పారెయ్యండి పోతా. (గోపాలరావు విసుక్కుంటూ ఒక తుంపు గురవయ్యమీద పారవేస్తాడు.)

గుర : (కోటయ్యవైపు కొరకొరచూస్తూ) ఉండు లంజకొడక నేను లంజకొడుకునా, పల్లెలోకిరా ! నా కొడక నీ పని చెపుతా (అంటూ బయటికిపోతూ వుంటాడు).

కోట : పోరా, కుండలగోకే నాయాల !

గుర : (వెనుకకుతిరిగి) ఏంటిరా ?

అప్ప : పోరా బాబు ! (ఇటుతిరిగి) నీకు ఏమైనా పిచ్చా, కోటాయ్ !

[గురవయ్య, ఏదో అందుకోబోతాడు. గోపాలరావు అతన్ని బయటికి పొమ్మని గద్దిస్తాడు. చిత్తం, అంటూ గురవయ్య వెళ్ళిపోతాడు.]

రంగ : వాళ్ళ కుటుంబం అంతా చాకిరీ, చేసేదిమీకు. మీ పొలంలో కూరకోసుకు వెళ్ళకపోతే, మరెక్కడ కోసుకు వెళతారండి గోపాలరావుగారు ?

గోపా : అదిగాదు రంగదాసూ ! ఇవ్వాళ ఇది అయింది, రేపు మరొకటవుతుంది. అడగకుండా కోసుకుపోవడం దొంగతనం అంటావా ? కాదంటావా ?

అప్ప : ఇట్టాంటి వాటికి కూడ పెద్ద పంచాయితీ పెడితే, వాడు జీతం చేసినట్టే, మీరు చేయించుకున్నట్టే—కాస్త మందలిస్తే పోయేదానికి.

గోపా : అందుకనే తట్టలో కాపురం, బుట్టలోకి వచ్చింది.

రంగ : అందరూ పెద్ద కాపురాలు ఎట్టా చేస్తారులెండి !

గోపా : వాడు కోసుకు వెళ్ళితే వెళ్లాడు, బాగానేవుంది. మల్లాయి కోసుకుపోతుంటే చూస్తూ వూరుకున్నాడు.

కోట : మీరే కోసుకోమన్నా రంటగా ?

గోపా : నీతో చెప్పానా ?

రంగ : మల్లయ్యతో చెప్పారుగా.

గోపా : నేను చెప్పానని, డెబ్భయిమంది వస్తారు. అంతేనా ఇక !

అప్ప : అట్టా ఎందుకు జరుగుతుంది లెండి. మల్లాయ్ మీ నాయన నాటినుంచి మీకు పాలేరు. ఆ కుటుంబం మీ పని ఉండగా మరొకరి పనికిపోరు.

కోట : కూర కోసుకు పొమ్మని, ఆయన మంచోడవ్వాలీ ! కాదని నేను కంకోష్టపు నాయాలు ననిపించుకోవాలీ ! చూడండి, నాయం.

గోపా : ఉండరా, తప్పుడు గాడిద ! అంత న్యాయం తెలిసిన వాడివి ముష్ఫయి బస్తాల జీతం ఎట్లా అడిగావురా ?

కోట : బువ్వ చాలదు దొరా, జీతం పెంచమన్నా. అదీ తప్పేనా ?

గోపా : ఇప్పటి దాకా సరిపోయిన బువ్వ గేపు ఎందుకు చాలదు ? ఆడింది ఆట, పాడింది పాటగా వుంది మీ పని.

రంగ : కాలం పూర్వం మాదిరిగానే వుందంటారా ఇప్పుడు కూడ ?

గోపా : దానికి నేనేం చేయను !

అప్ప : చేసేది ఏముంది ? ఊళ్ళో చాలామంది రైతులు 30 బస్తాలు యిస్తానికి వొప్పుకున్నారుగా, నలుగురుతో పాటు నారాయణా.

గోపా : ఊం గింజలు అంతే తేరగా లేవు, కొలవడానికి.

కోట : తేరగా పొమ్మన్నా నా కెందుకు. కష్టంచేసి అడుగుతున్నా.

గోపా : నువ్వు చేసే కష్టం అంతా ఇంతా !

కోట : ఎంతైనా, చేసేది నే నేగా. మీరేమన్నా చేస్తున్నారా ?

గోపా : మల్లాయిలాంటి పాలేరుకు కూడా మా నాన్న ఇరవై బస్తాలకు ఎక్కువ ఇచ్చేవాడు కాదు. నీ అందానికీ, నీ పనితనానికీ ముప్ఫయి బస్తాలు గావాలి !

రంగ : ఆ రోజుల్లో పెట్టుబళ్ళు, కల్లాలు అనేకం వుండేవి. ఇప్పుడు అవి ఏవీ లేవుగా.

అప్ప : (గోపాలరావుతో) నిజమే. కోతల్లో, కుప్ప నూర్పిళ్ళలో, మల్లాయికి అన్నం మీ ఇంట్లోనుంచే వచ్చేది. ఆ కాలమే వేరు !

కోట : ఇప్పటికిమల్లీ గోగాకుక్కూడా దొంగతనం అంటగట్టే వారు కాదుగా.

గోపా : నాలాంటి పెద్దరైతులు ముప్ఫయి బస్తాలు ఇచ్చినా ఫరవాలేదు. కాని ఈ అప్పయ్యలాంటి పేద రైతులు పని ఏంకావాలి !

అప్ప : మా తిప్పలు ఆ దేవుడికి తెలియాలి !

రంగ : ఇలాంటి పేదరైతులు, తమకు ఏదోవుందని, భ్రమ పడుతున్నారు గాని, నిజంగా పేదరైతుకూ కూలివాడికీ ఏంతేడావుందండి గోపాలరావుగారు ? ఈ అప్పయ్యగారినే చూడండి. పదిమంది కూలీలతో ఆ రెండు ఎకరాలు కోత కోయించు కుంటారు. తరవాత తనే కూలికి పోతూ వుంటాడు. అంతేనా, అప్పయ్యగారూ ?

అప్ప : అంతేమరి. పారచూస్తే కూలాడికంటే నా ఎక్కువ ఏముంది !

గోపా : ఇంతకీ రైతులకు తిప్పలు వచ్చినై. చివరకు కూలి వాళ్ళు రైతుల్ని దోచుకోవడానికి తయారౌతున్నారు.

రంగ : పొరపడుతున్నారు. రైతుల కోరికలన్నీ తీరాలని మా సంఘంలో కూడా తీర్మానాలు చేశాం. రైతుకు పని ముట్లు సక్రమమైన ధరకు అందించాలనీ, ఎరువులు ఇవ్వాలనీ, రుణాలు రద్దు చెయ్యాలనీ, జమీందారీ విధా నాన్ని రూపుమాపాలనీ కోరుతున్నాం.

గోపా : కోరుతున్నారు. ప్రయోజనం ! ప్రభుత్వం ఇవన్నీ చెయ్యాలిగా !

రంగ : చెయ్యకపోతే పోరాడి చేయించుకుంటాం. ముందు మీరు నిలబడండి, మీ వెనకాల మా కూలీలంతా నిలుచుంటాం.

కోట : నిలవటం ఏంటి! చావుకు తెగించి పోట్లాడతాం.

అప్ప : మీరేనా ! మేమంతా చచ్చామా ?

గోపా : ఇదీ వరస. మాట్లాడితే ప్రభుత్వంతో తన్ను లాడదాం రమ్మంటాడు.

కోట : కుండలో కూడు కుండలోనే వుండాలి, బిడ్డలు దుడ్డు లల్లే వుండాలంటే ఎట్టా కుదురుతుందండి ?

అప్ప : మంచిమాట చెప్పావ్‌రా అబ్బాయ్ !

గోపా : ఏరా కోటిగా ! ఇంతకూ నీవు పాలికబస్తాలకు ఉండనంటావ్ ?

కోట : ఉండనుండి.

గోపా : ఉండకపోతే రేపు ఈపాటికి ఇల్లు ఖాళీచెయ్యి.

కోట : ఇల్లా !

గోపా : అవును, ఇల్లే. ఎవడి తాతగాడి సొమ్ము ? కూచ్చుని కులుకుదాం అనుకున్నావ్.

అప్ప : ఇల్లేమిటి ?

గోపా : వీడు తన పెళ్ళికి డబ్బు తీసుకువెళ్ళి నాకు ఇల్లు తాకట్టు పెట్టాడు. ఇప్పుడు వీడి కూతురుకి పెండ్లయీడు వచ్చింది. అప్పు అట్లాగే వుంది.

కోట . నాటినుంచి నేటిదాకా నేనూ నా పెళ్ళాము మీకు చాకిరి చేస్తానే వుండాం.

గోపా : అబ్బో ! నీ పెళ్ళాం చేసే చాకిరీ అడుగుతావ్ ? "మీ దొరసాని వ్రాళ్ళో లేదు, వచ్చిఇల్లు అలికిపొమ్మ"ని వారం రోజులనుంచి కబురు పంపుతున్నా, తిరిగి చూచిన పాపానపో లేదు.

కోట : నాకు ఒకనాడైనా చెప్పలేదేం ? ఎవరితో కబురు పంపారు ?

గోపా : (బిగ్గరగా) గురవాయ్ ?

గుర : (ప్రవేశించి) ఏంటి దొరగారు ?

గోపా : వీడి పెళ్ళాన్ని ఇల్లు అలకడానికి రమ్మని చెప్ప మన్నాగా నీతో, చెప్పావుగా ?

గుర : వక్క సారేంటి. వందసార్లు చెప్పా.

గోపా : ఏమి అంది ?

గుర : ఓపిక లేదు పొమ్మంది.

గోపా : విన్నావుగా రంగదాసూ ?

అప్ప : అమ్మాయి వూరికి ఎప్పుడెళ్ళిందండి, ఇంటిపక్క నున్న నాకే తెలియ లేదు.

గోపా : మూడో మాసం, ఇదివరకు ఒకటి రెంటూ నష్టపడి వున్నానుగా, అందుకని ముందుగానే అమెరికా ఆసు పత్రికి పంపించాను

అప్ప : అట్టాగా, ఇట్టాటి ఇబ్బంది సమయాన్ని కూడ కనిపెట్టక పోతే ఎట్టాగురా కోటాయ్ ?

కోట : మా ఇబ్బంది ఏ దేముడు కనిపెట్టను. దానికి తొమ్మిది నెల్లూ నిండినై. రేపో, మాపో, ఉతకలాడే టట్టుంది.

గోపా : అట్లావుండికూడ ఇదివరకు అనేకసార్లు ఇల్లు అలికి పోయింది. ఇప్పుడు రాణీ అయిందిగాని.

మల్ల : (ప్రవేశించి) ఏంరో, కోటయ్యా ! నువ్వు ఎట్టాటిపుటక పుట్టావ్ రా ?

కోట : ఏంటే ?

మల్ల : ఇంటికాడ నీ పెళ్ళాం నీలాడింది. దిక్కూ మొక్కూ లేదు. మా ముసలిది గోలచేస్తే నిన్ను పిలుచుకు పోదామని వచ్చా. పదరాకొంపకి. మగపిల్లాడు పుట్టాడు.

కోట : పోతన్నా దొరగారు !

మల్ల : పోయి ఏం చేత్తావ్ ? నీ మొగం. దొరగారిని అడిగి "బిరాణీ" కన్నా రొండు రూపాయలు పట్టికెల్లు.

[కోటయ్య గోపాలరావు వైపు చూస్తూ నుంచుం టాడు].

గోపా : ఇక్కడ కోళ్లు ఏరుకుతినడంలేదు రూపాయలు. పో, పో, రేపు ఇల్లు ఖాళీచెయ్యి.

అప్ప : రేపు ఎట్లా కాళీచేస్తాడండి ! పాపం, వాడి పెళ్ళాం నీళ్లాడివుంటే .

గోపా : అంత దయగల మొనగాడివి అయితే, తీసుకుపోయి పెట్టుకో నీ ఇంట్లో. చెప్పడానికి బయలుదేరావ్ (శ్రీరంగ నీతులు.

కోట : (కోపంగా) ఇంటోనుంచి లేచిపోవాలి! నేను లేవనే లేవను. నా రగతం దార పోశాను నీకు. ఇరుకున పెట్టి నా పీక పిసకాలని జూస్తున్నావ్.

గుర : లేవక ఏం చేస్తావురా ? ముడ్డిమీద రెండు తన్ని తే, నువ్వు లేస్తావా, నీ తలలో జేజిలేస్తుందా.

రంగ : (కోపంగా) ఛీ నోరుముయ్, అసలు పల్లెకు తిప్పలు తెచ్చేది నీబోటి దరిద్రులు.

కోట : ఈడిమూలానకాదు, నేను అప్పులపాలైంది. నా పెళ్లికి మూడు పందులుంటేగాని వీలు లేదన్నాడు. "కల గల్లు"కనీ, దానికనీ, దీనికనీ మొత్తం నూటయాభై పెట్టి చ్చాడు నాచేత.

గుర :. అందుకని యేమంటావురా ముండమోపి! ఇల్లు కాళీ చెయ్యనంటావా ?

గోపా : చెయ్యకపోతే, గోదావరిస్నానం చేస్తాడు.

రంగ . గోదావరి స్నానమా ! ఎందరిని పెట్టిస్తారుజైల్లో ?

కోట : అందాకవస్తే అప్పుడే తేల్చుకుంటా చావో, బతుకో.

గోపా : (మండిపోతూ) పక్కలు విరగతన్నరా గురవాయ్ ! ఈ గాడిదకొడుకుని. వీడి అమ్మామొగుడు ఎవడు అడ్డం వస్తాడో చూస్తాను.

గుర : ఎంతమందిని చంపుతావురా (అంటూ కోటయ్యపైకి వెళ్ళబోతాడు)

కోట : (కర్ర సవరించుతూ) రారా, తాగుబోతు గాడిద కొడక !

రంగ : (గురవయ్యవైపు తిరిగి) ఖబడ్దార్ !

గోపా : (అప్పయ్య నుద్దేశించి) అట్లా చూస్తావేమయ్యా ! రైతుపుటక పుట్టలా నీవు.

అప్ప : (ఉద్రేకంగా) ఇట్టాగేగా మొదటినుంచి మా కొంపలు తీసింది. నమ్మినందుకు వాడినీ, నన్నూ కూడా ముంచావు! ఇంకా ఎన్నాళ్ళు జుట్లుకు జుట్లు ముడిపెడతావ్ !

రంగ : ప్రజలు కళ్లు తెరచారు. మీ ఇష్టం వచ్చినట్లు చిందులు దొక్కే రోజులు గతించినై.

కోట : తుమ్మితే వూడిపోయే ముక్కు ఎన్నాలదాకా వుంటుంది. అప్పయ్యగారూ ! రండి పోదాం.

అప్ప : ఈ దెబ్బతో తాడో పేడో తేల్చుకుందాం, పద, పోదాం.

[రంగదాసు ముందునడుస్తూ వుంటాడు. అప్పయ్య, కోటయ్య చెయ్యి చెయ్యి పట్టుకుని అతనిని అనుసరిస్తారు. అందరికంటే వెనుక మల్లయ్య నడుస్తూ వుంటాడు.]

గోపా : అరె, మల్లాయ్ !

[మల్లయ్య "నీకు ఒక సలాంబాబూ" అన్నట్లుగా వంగి దణ్ణంపెట్టి వెళ్ళిపోతాడు.]

గోపా : పొండి గాడిదకొడుకుల్లార !

[వెర్రివాడిలాగా అటూ ఇటూ తిరుగుతూ వుంటాడు. గురవయ్య తెల్లపోయి అతనివంక చూస్తూ వుంటాడు.]

[ తెర ]



సుంకర సత్యనారాయణగారి

# ఇతర రచనలు



| | | |
|---|---|---|
| భూమికోసం | (నాటకం) | 1—4—0 |
| ప్రతిఫలం | (నాటికలు) | 1—0—0 |
| వీరకుంకుమ | ,, | 1—0—0 |



| | | |
|---|---|---|
| సీతారామరాజు | (బుర్రకథ) | 0—4—0 |
| కష్టజీవి | ,, | 0—3—0 |
| రుద్రమదేవి | ,, | 0—6—0 |

ప్రతులకు

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ - 2.